# పండ్లదినుసులను నిల్వజేయుట.

## (PRESERVATION OF FRUIT PRODUCTS.)


రచయిత

శ్రీమతి ద్వారకాబాయి దేవు.

అనువాదకుడు

రావుసాహెబ్ గోటేటి జోగిరాజు

**(Retired Asst, Director of Agriculture)**



1941

స్వాస్థ్యసంకలితము          వెల రు 0—6—0 లు.

కొండెవరం

స్వయంపోషక కృష్యాశ్రమమునందలి
శ్రీ గ్రామసేవాముద్రాలయమున ముద్రింపబడి,
యనువాదకునిచే ప్రచురింపబడెను.

ప్రతులు కావలసినవారు
శ్రీ గ్రామసేవాముద్రాలయపు మేనేజరుగారికి
కొండెవరం పోస్టుకు (పిఠాపురంద్వారా)
వ్రాయవలెను.

# అనువాదకుని పీఠిక

నాచే రచింపబడిన "పంట్లు" అను గ్రంథమున పండ్లు దినుసులనుండి మురబ్బాలు, లేహ్యములు, హాల్వాలు తయారుచేసి నిల్వయుంచు విధానములను గురించి సంగ్రహముగ వ్రాయబడెను. స్వంత ఉపయోగమునకు ఇట్టి తినుబండారపు వస్తువులను చేసికొనువారికి గాని, విక్రయమునకు గృహపరిశ్రమగ నీవ్యాపారము నవలంబింప దలచినవారికి గాని సుళువుగ ఆచరణ యోగ్యమగు సలహాలతో గూడిన యొక గ్రంథమును ముందు ప్రచురింప నుద్దేశించి యుంటిని. కాని యీలోపుగనే మధ్యరాష్ట్ర బీరారులందు గ్రామోద్ధరణోద్యోగియగు శ్రీ టి. వై. దేవు గారిసతీమణి శ్రీమతి ద్వారకాబాయిదేవుగారు ఆంగ్లమున రచించిన యీ గ్రంథము నాకంటబడెను. ఆమె గ్రంథము నా యాశయమునకు సరిపడుటచే నేను మరల తెనుగున వ్రాయుటకంటె దాని యనువాదమునే ప్రచురించుట యుచితముగ దోచి, యందులకామె భర్తగారిద్వారా యనుమతిని బడసితిని. ఈపుస్తకమున అనుభవపూర్వకముగను, ఆచరణ యోగ్యముగను వ్రాయబడిన 25 యోగములు గలవు. పాలనుండి కోవా (Toffee) తయారు చేయుటను గురించియు, జొన్నల నుండి మాల్టు తయారు

చేయుటను గురించియు మరి రెండు యోగములు అనుబంధముగ జేర్చబడెను. ఇట్టిరువదియేడు యోగములతో గూడిన యీ తెనుగు పుస్తకము ఆంధ్రదేశమందలి గృహిణులకును, గృహపరిశ్రామికులకును, ఉపచరించునని నమ్ముచున్నాను.

కొండెవరం
18-6-41

గోటేటి జోగిరాజు

# ఇంగ్లీషు పుస్తకపు ఉపోద్ఘాతమున కనువాదము.

నా భార్యయగు ద్వారకాబాయి దేవు, గత మూడు సంవత్సరముల నుండియు పండ్లను డబ్బాలలో నిల్వచేయుటను గురించి నేను చేయుచుండిన పరిశోధనలందును, ప్రయోగములందును నాకు సహాయముగ నుండెను. ఈ చిన్న పుస్తకమున నామె స్వానుభవముచే వ్రాసిన విషయము లొకచో జేర్చబడెను. ఇందలి యోగములన్నియు ఆమె మా యింట నమలులో బెట్టి తయారుచేసిన వస్తువులు. నిత్యోపయోగము నందున్నవి.

ఈ పుస్తకమున పండ్లను నిల్వచేయుటను గురించిన శాస్త్రీయచర్చలోనికి దిగబడలేదు. అవసరమగుచో నీ విషయములను తెలిసికొనగోరు వారు మధ్యరాష్ట్రి వీరారుల గారి మూదగజోద్యోగి ప్రచారకునికి నాగపూరు వ్రాయవచ్చును. సామాన్య గృహోపకరణములతో ప్రతి యిల్లాలును తనయింట సులభముగ నాచరణలో బెట్టదగు విషయములే యిందు వ్రాయబడెను. పండ్లలోనుండు విటమినుల విలువ యిప్పుడిప్పుడు క్రమముగ గుర్తింపబడుచుండుటచే నీకాలపు యువతీ యువకులకు గృహనిర్వాహక శాస్త్రమునకు తోడుగ పండ్లనుకూరలను నిల్వచేయుటను గురించిన కొంత జ్ఞానము లభింప చేయుటయే యామె యాశించుచున్నను.

ఈ పుస్తకము పండ్లతోటల యజమానులకు గూడ కొంత ప్రయోజనకారిగ నుండవచ్చును. తోటలలో అమ్ముడుపోకుండ మిగిలిపోయిన పండ్లను, పండ్లలో నుపయోగింపగా మిగిలిన భాగములను వృథాపోకుండ నిల్వచేసికొను పద్ధతులను వారు నేర్వగలరు.

ఈ పుస్తకమువలన పైని చెప్పిన యాశయములు నెరవేరునని యెంచుచున్నాను.

టి. వై. దేవు

# విషయసూచిక

# పండ్ల దినుసులను నిల్వ జేయుట.

## సామాన్య సూచనలు.

(జాగ్రత్తగ చదువుడు)

1. ఉపయోగించు సీసాలను జాడీలను పరిశుభ్రమైన నీటితో బాగుగ కడగవలెను.

2. పిమ్మట వానిని ఉడుకునీటిలో నరగంట సేపు సూక్ష్మజీవరహితము(Sterilise) గావింపవలెను. ఇందుకు వానినొక చన్నీటి తొట్టిలో వేసి క్రింద మంట బెట్టి నీరు మరుగ నారంభించిన పిమ్మట నరగంట వరకు కాచవలెను. కావలసి నపుడు తొట్టిలోనుండి వీనిని వేడిగ నుండగనే తీసి కొనవలెను.

3. రసములను వడకట్టుట కుపయోగించబడు గుడ్డ లన్నిటిని మొదట నీటిలో వేసి యుడికించిన పిమ్మట యుపయోగింపవలెను.

4. ఉపయోగించబడు బిరడాలను గూడ పైని చెప్పినట్లు గాని, మిథలేటెడ్ స్పిరిట్ ( Methylated spirit ) లో వేసిగాని సూక్ష్మజీవరహితము గావింపవలెను.

5. నిల్వచేయు పండ్లను గాని. కూరగాయలను గాని పరిశుభ్రమగు నీటితో కడుగవలెను. ఈ నీటిలో కొంచెము పొటాసియము పర్మాంగనితము (Potassium permanganate) చేర్చుట మంచిది.

6. పండ్లు వగైరాలు నిల్వ యుంచుటకు గాను వానికొక నిర్ణీత మైన యుష్ణత వచ్చువరకు వేడినీటిలో నుంచవలెను. ఈ పనికి పాశ్చురీకరణము ( Pasturisation ) అని పేరు.

7. ఇందుకు గాను సీసాలును జాడీలును మునుగునంత లోతు గల పాత్రయొకటి కావలెను. ఒక కిరసనాయల్ డబ్బా రెండుగా కోసిన సెడుకు నుపయోగించును.

8. ఇందుకు వలయు నితర పాత్రలన్నియు సామాన్యముగ ప్రతి యింటను లభించును. మరియే పనిముట్లును అవసరము లేకుండగనే యుండలి యోగము లన్నిటిని నములులో పెట్టవచ్చును. శతాంశ ఉష్ణమాపకము (Centegrade thermometer) ఒకటి మాత్రము కావలెను. ఇది 150° శ. ల వరకు సూచింప దగినదగ నుండుచో టాఫీ (Toffee), హల్వా (Jelly) పాకము (Syrup) మొదలగునవి కూడ తయారు చేయవీలగును.

9. పండ్లు వగైరాలు చెడిపోకుండ నిల్వ యుండుటకు పరిశుభ్రతయే ప్రధాన విషయము.

10. కత్తులు, పాత్రలు మొదలగు వానిని శుభ్రముగ జేయుటకు సలసలకాగిన నీటిని విరివిగ నుపయోగించ వలెను.

# నారింజ గణము నందలి పండ్లజాతుల రసమును నిల్వచేయుట.

## పాశ్చురీకరణపుపద్ధతి.

రసమును రెండు విధములుగ నిల్వజేయవచ్చును.

1. రసాయనిక విధానము.

2. పాశ్చురీకరణము. అనగా 70° . శ. ల [illegible] రసమును కాచుట.

ఈ క్రింద రెండవ పద్ధతిని అనగా పాశ్చురీక[illegible] వలన నిమ్మరసమును నిల్వచేయు విధానము తెలు[illegible].

1. దినుసు :—నిమ్మకాయలు.

2. పద్ధతి :—పండ్లను కడిగి రసమును యంత్రముతో [illegible]. కొద్ది రసము తీయుటకు మనయిండ్లలో నుపయోగింపబడు [illegible] ((Glass cone) చాలును.

3. విత్తులును, ముత్యములును లేకుండ వడపోయుము.

4. సూక్ష్మజీవరహితము గావింపబడిన గాజుజాడీలలో అంచువరకు నీ రసము పోసి పైని మూతవేయుము. కరగించిన పారఫిన్ మైనము ( Paraffin wax ) ను పట్టించి లోనికి గాలి జొరకుండ జేయుము.

5. రసము నందలి మడ్డి దిగుటకు గాను జాడీలను 15 దినములట్లే యుంచుము. ఇట్లు చేయనిచో రసము తేటగ నుండదు. మడ్డి దిగిన వెనుక పైరసమును క్రిందిమడ్డి కదలిపోకుండ తీయుము. ఇందుకు రబ్బరు వంకుపు గొట్టము (Rubber syphon) నుపయోగింపవచ్చును.

6. ఈ రసమును జనాకు గుడ్డతో గాని యితర దళసరి గుడ్డతో గాని వడకట్టుము.

7. సూక్ష్మజీవరహితము చేయబడిన సీసాలలో నీ రసమును పైన నొక యంగుళము స్థల ముండునటుల బోయుము.

8. పాశ్చురీకరణము చేయునపుడు సీసాలకు నేరుగ వేడి తగులకుండగ నీటిని గాచు పాత్రలో దళమైన గుడ్డ (తువ్వాలు) నొకదానిని వేసి దానిపై సీసాల నుంచుము. పాత్రను ముప్పాతిక భాగము నింపి $70^0$ శ. ల ఉష్ణత గలుగువరకు కాచుము. ఈయుష్ణతగల నీటిలో 30 నిమిషముల వర కుంచవలెను. $70^0$ శ. ల ఉష్ణత గల్గిన పిమ్మట ఉష్ణత అంతకంటె హెచ్చకుండ మంట దిగవేయవలెను. లేక కొంతసేపు పాత్రను క్రిందికి దింపవలెను.

9. ఎట్లయినను ఉష్ణత యెప్పుడు గాని $72^0$ శ. లకు మించనీయ కూడదు.

10. పాశ్చురీకరణము పూర్తియైన పిమ్మట యరగంట సేపుంచి సీసాలకు బిరడాలను వేసి కరగించిన పారఫిన్ మైనము పూసి గాలి పోగకుండ చేయుము. చల్లని స్థలమున నిల్వ యుంచుము.

ఇంగ్లండు నందును అమెరికాలోను పొటాసియమిపన్వైగంధకాయితమును పైని చెప్పిన పరిమితికి మించకుండ పండ్ల రసములను షర్బత్తులను నిల్వజేయుట యందుపయోగించుటకు శాసనవిధులు అనుమతించును.

---

3వ యోగము.

## నిమ్మరసమును పాకముపట్టుట.

1. పండ్లను కడిగి యంత్రముతో రసముతీయుము.

2. గింజలును ముదుగు గుజ్జు (Pulp) ను పోవునట్లు రసమును వడకట్టుము.

3, రసమును తూచుము. (పౌనులుగా)

4. సీసాలను బిరడాలను సూక్ష్మజీవహరణ పాత్రయందు బెట్టుము.

5. ఒక పౌను రసమునకు చక్కెర 2 పౌనులు నీరు ½ పౌను చొప్పున తూచి యుంచుము.

6. చక్కెర, నీరు కలిపి అగ్నిపై నుడకబెట్టి చిక్కని పాకము తయారుచేయుము. ఉష్ణతామాపకముచ్చినచో 102° శ. ల ఉష్ణత వచ్చువరకు మరగనిమ్ము.

7. గోరువెచ్చగ నుండు వ గారనిమ్ము.

8. రసము నీ గోరువెచ్చని పాకముతో జేర్చి బాగుగ గలుపుము.

9. సూక్ష్మజీవరహితము గావింపబడిన సీసాలలో బోసి బిరడాలను బెట్టుము.

10. కరగించిన పారఫిన్ మైనమును పూసి గాలి చొరకుండ జేయుము. చల్లని స్థలమునందు దాచుము.

వరా:—చక్కెరను పాకముబట్టుటకు మరగించిన నీటి నుపయోగింపుము. పైని చెప్పినట్లు తయారుచేసిన నిమ్మరసపు పాకమును 70° శ. ల ఉష్ణతయందు ఇరువది నిముషములు పాశ్చురీకరణము చేసిన చాల కాలము నిల్వ యుండును. ఈ పని గృహోపయోగమున కవసరము లేదు.

---

## 4వ యోగము.

# నిమ్మషర్బతు.

## (రసాయన విధానము)

1. పండ్లను కడిగి యంత్రముతో రసము తీయుము.
2. పిప్పులును, ముదుగు గుజ్జును పోవునట్లు రసమును వడకట్టుము.
3. రసమును కొలుచుము. (పౌనులుగా)
4. సీసాలను బిరడాలను సూక్ష్మజీవహరణ పాత్రయందు పెట్టుము.
5. పది పౌనుల నిమ్మ రసమునకు చక్కెర 20 పౌనులు, నీరు 2 పౌనులు చొప్పున తూచుము.
6. చక్కెరతో రసమును నీటిని జేర్చి కాచుచుండగనే చురుకుగ కరగునట్లు కలుపుము.
7. రసమును తీయగా మిగులు తొక్కలను కొన్నిటిని బాగుగ నూరి నీటితో నుడుకబెట్టి తేనెరసాయమును (Emulsion)ను వడకట్టి నూటికి 4

వంతులు చొప్పున జేర్పుము. ఇందువలన షర్బతు పరిమళము హెచ్చును.

8. పది పౌనుల రసమునకు పావుతులము చొప్పున పొటాసియమిత ద్విగంధకాయితమును జేర్చుము.

9. సూక్ష్మజీవరహితము జేయబడిన సీసాలలో నీ మిశ్రణమును బోయుము.

10. ప్రతి సీసాలోను కొన్ని నిమ్మ ముత్యములనుకూడ జేర్పుము.

11. కరగించిన పారఫిన్ మైనము పూసి గాలిచొరకుండ జేయుము. చల్లని స్థలమున నిల్వ యుంచుము.

ఘరా:—కాచిన నీటినే యుపయోగించవలెను. చక్కెర కరగుట యాలస్యమైనచో నా మిశ్రణమును కొద్దిగ వెచ్చజేయుము. ఉష్ణతామాపక మున్నచో వేడిమి 45° శ. లకు హెచ్చసేయకుము.

---

## 5 వ యోగము.

# నిమ్మషర్బతు.

## (పాశ్చరీకరణము)

1. వెనుకటి యోగమున చెప్పినట్లు నిమ్మరసమును, తొక్కల రసాయనమును, నీటిని, చక్కెరను కాచకుండగనే అందు చెప్పిన పాళ్ల చొప్పున కలుపుము.

2. సూక్ష్మజీవరహితము చేయబడిన సీసాలలో నింపుము.

5. $\frac{3}{4}$ పౌను నారింజ రసమునకు $\frac{1}{4}$ పౌను నిమ్మ రసము, 2పౌనులు చక్కెర, 1 పౌను నీరు చొప్పున తూచియుంచుము.

6. మొదట నారింజ నిమ్మ రసములను పైని చెప్పిన పాళ్ల చొప్పున కలుపుము.

7. నీటిని చక్కెరను కలిపి కాచి చిక్కని పాకము చేయుము. (103° శ. ల వరకు మరుగనిమ్ము)

8. పాకమును చల్లారనిమ్ము.

9. పరిమళము హెచ్చుటకు గాను రసము పిండివేసిన నారింజ తొక్కలను కొన్నిటిని బాగుగ నూరి నీటిలోవేసి కాచి వడపోసిన కషాయమును నూటికి 4 వంతులు చొప్పున జేర్పుము.

10. రసమును పాకమును కలుపుము.

11. సూక్ష్మజీవరహితముగ జేయబడిన సీసాలలో నింపుము.

12. వీనిని 70° శ. ల ఉష్ణతయందు అరగంటసేపు పాశ్చ్యూరీకరణము గావింపుము.

13. పిమ్మట కరగించిన పారఫిన్ మైనమును పట్టించి గాలి చొరకుండ జేయుము. చల్లని స్థలమున నిల్వ యుంచుము.

వ.రా:—కాచిన నీటినే యుపయోగింపుము. కమలాఫలములు, [illegible]యన నారింజ రసములకు పైని చెప్పినట్లు నిమ్మ రసము జేర్చుట యవసరము. పుల్లగానుండును గావున శీతకట్టునవచ్చు కమలా నారింజపండ్లు [illegible] కెక్కువ యనుకూలము. దేశవాళీ నారింజపండ్ల రసమునకు సామాన్యముగ నిమ్మ రసమును జేర్పనవసర ముండదు.

---

# 7వ యోగము.

# నారింజ షర్బత్.

## రసాయనిక విధానము.

(తీయనారింజ లేక కమలాఫలములనుండి)

1. నారింజ పండ్లను రెండుగ కోసి రసమును పిండుము.

2. గింజలును ముదుగు గుజ్జును పోవునట్లు రసమును వడకట్టుము.

3. రసమును తూచుము. (పౌనులుగా)

4. సీసాలను బిరడాలను సూక్ష్మజీవహారిణి పాత్రయందు పెట్టుము.

5. ఒక పౌను నారింజ రసమునకు ½ తులము నిమ్మపువ్వు (సిట్రిక్ ఆమ్లము (Citric acid), 1½ పౌనుల చక్కెర చొప్పున తూచుము.

6. మూటిని కాచకుండగనే పై పాళ్ల చొప్పున కలిపి కరగించుము.

7. పరిమళము హెచ్చుటకొరకు రసముతీసిన నారింజ తొక్కల రసాయనమును నూటికి 4 వంతులు చొప్పున జేర్చుము.

8. ప్రతి పది పౌనుల రసమునకు పావుతులము పొటాసియమిత ద్విగంధకితాయితమును జేర్చుము.

9. బాగుగ కలిపి సూక్ష్మజీవనాశనము గావింపబడిన సీసాలలో బోసి బిరడాలను బెట్టుము.

10. కరగించిన పారఫిన్ మైనమును పట్టించి గాలి చొరకుండ జేయుము. చల్లని స్థలమున నిల్వ చేయుము.

వరా:—నిమ్మపూవుకు బదులు నిమ్మ రసమును నారింజ రసములోని మూడవ వంతు అనగా ¾ పౌను నారింజ రసమునకు ¼ పౌను నిమ్మరసము చొప్పున కలుపవచ్చును. దేశవాళీ నారింజపండ్ల రసముతో సామాన్యముగ దీనిని జేర్పనవసరముండదు.

---

8వ యోగము.

# మామిడిపండ్ల రసమును నిల్వ చేయుట.

1. పండ్లను కడిగి రసమును పిండుము.
2. పీచు పోవునట్లు రసమును వడకట్టుము.
3. సీసాలను బిరడాలను సూక్ష్మజీవరహితము గావింపుము.
4. రసమును సీసాలలో బోసి బిరడాలను పెట్టుము.
5. బిరడాలు లేచిపోకుండ గుడ్డ పీలికతో సీసామూతులను గట్టిగ గట్టుము.
6. వీనిని 80° శ. ల ఉష్ణతగల నీటియందు 1వ యోగమున జెప్పినట్లు అరగంటసేపు పాశ్చురీకరణము జేయుము.
7. ఉష్ణతామాపకము లేనిచో నీరు మరుగువరకు కాచి కొంచెము వేడి తగ్గనిచ్చి మంట కూడ తగ్గించి అందు సీసాలను అరగంట సేపుంచవలెను.

8. సీసాలను తీసి గాలి చొరకుండ కరగించిన పారఫిన్ మైనము పట్టించి చల్లని స్థలమున నిల్వచేయుము.

ష.గా:—పైని చేసి నొక్కుటకు వీలగు మూతలను సీసాలను ఉపయోగించిన బాగుగ నుండును. కాని యిందుకు మూతల నొక్కుయంత్రమొకటి కూడ కావలసి యుండును.

---

## 9 వ యోగము.

# నేరేడుపండ్ల రసమును నిల్వజేయుట.

1. బాగుగ పండిన మంచి పండ్లనెంచి శుభ్రముగ కడుగుము.

2. చేతితో పిసికి మంటాగ్నిపై నుడికించుము. (మంచి రకపు పండ్లనైనచో యుడికించకుండగనే రసమును తీయవచ్చును. కాని ఉడికించినచో హెచ్చు రసము వచ్చును.)

3. రసమును ముతుక గుడ్డతో వడకట్టుము.

4. సూక్ష్మజీవనాశనము గావించిన సీసాలలో నీ రసమును బోసి నింపుము.

5. అందలి రసమును 80° శ. ల ఉష్ణత యందు ముప్పది నిముషములు సూక్ష్మజీవనాశనము గావింపుము.

6. సీసాలకు బిరడాలు పెట్టి కరగిన పారఫిన్ మైనము పట్టించి గాలి జొరకుండ జేయుము.

7. ఉష్ణతాపమాపకము లేనిచో నీటిని ఉడికించి అందు రసపు సీసాలను 30 నిముషములుంచి పిమ్మట బిరడాలను పెట్టుము.

8. నేరేడుపండ్ల రసమును విక్రియమునకు గూడ తయారు చేయవచ్చును. దీనినుండి పాటలవర్ణము గల రమ్యమగు పాల్యాను కూడ చేయవచ్చును. దీని రసము అతిమూత్ర వ్యాధిగ్రస్తులకు మంచి మందు. దీనినుండి సిరకా ( Vinegar ) కూడ చేయవచ్చును.

---

10 వ యోగము.

# మామిడిషర్బతు.

(పచ్చి మామిడికాయల నుండి)

1. కాయలను కడిగి తొక్క గీయుము.
2. చిన్న చిన్న ముక్కలుగ తరిగి తూచుము.
3. ముక్కలు మునుగునంత నీరుపోసి అరగంటసేపు ఉడకబెట్టుము.
4. రసము ముతుక గుడ్డతో వడకట్టుము.
5. ఒక పౌను రసమునకు రెండు పౌనుల చక్కెర వొప్పున తూచి కలుపుము.
6. రంగు నిచ్చుటకు కించుక పసుపును, పరిమళము కొరకు కొంచెము ఏలకులపొడుమును కలుపుము.
7. పది పౌనుల రసమునకు పావుతులము పొటాసియమిత్ద్విగంధకాయితమును గలుపుము.

8. సూక్ష్మజీవహరణము గావింపబడిన సీసాలలో బోసి బిరడా లను పెట్టుము. కరగిన పారఫిన్ మైనము పట్టించి గాలి చొరకుండ జేయుము.

9. రక్షకద్రవ్యము ( Preservative ) ను జేర్చ దలపక పోయి నచో 1 వ యోగమున 8 వ సూచన ప్రకారము 80° శ. ల ఉష్ణత యందు అరగంట సేపు పాస్చురీకరణము గావింపుము.

10. మామిడికాయల రసమునుండి నిమ్మకాయల రసమునుండివలెనే పానము గూడ తయారు చేయవచ్చును.

---

11 వ యోగము.

# సీమవంగపండ్ల రసమును నిల్వచేయుట

1. బాగుగ పండిన మంచి పండ్ల నెంచి కడుగుము.

2. పండ్లను ముక్కలుగ గోసి నీరు చేర్చకుండగనే మందాగ్నిపై కాచుము. ఇందుకు అల్యూమినియపు పాత్రగాని మంటి పాత్రగాని నుపయోగించ వలెను.

3. ముక్కలు బాగుగ మెత్తబడు వరకు అనగా సుమారొక యర్ధగంట వరకు ఉడుకబెట్టవలెను.

4. గింజలును తొక్కలును మాత్రము మిగులునట్లు సన్న జల్లెడలో (ఇందుకు దోమతెర గుడ్డవంటి దనుకూలము) వేసి కదుపుము.

5. దిగినరసమును సూక్ష్మజీవహరణము గావించిన సీసాలలో బోయుము.

6. వీనిని ఉడుకునీటి (100° శ. ల) యుష్ణత యందు అరగంట సేపు పాశ్చురీకరణము గావింపుము.

7. బిరడాలు వేయుము.

8. ఈ రసము నుండి పులుసు (Sauce) హాల్వా (Jelly) మొదలగు వానిని గూడ చేసికొనవచ్చును.

---

## 12 వ యోగము.

# లేహ్యము తయారుచేయుట

(పెద్దఉసిరికాయలనుండి)

1. ముచికలను (పుష్పకోశములసహా) తీసివేసి కాయలను కడుగుము.

2. వీనిని తురుము యంత్రము (Mincing machine) లో వేసి రసము చిందకుండ నలుగగొట్టుము.

3. నలుగగొట్టిన ఉసిరిక      కూనికి సమానమగు చక్కెరను తూచుము.

4. ఉశిరికాయలలో తగినంత నీరుండును గాన వేరుగ నీటిని చేర్చ నవసర ముండదు.

5. తయారయిన యుసిరి తురుముతో చక్కెర జేర్చి పొయ్యిమీద పెట్టి యుడికించుము.

6. నీ రిగిరి తగినంత చిక్కబడు వరకు అనగా 103° శ. ల ఉష్ణత వచ్చువరకు ఉడికించి దింపుము.

7. వేడిగనుండగనే సూక్ష్మజీవహరణము గావింపబడిన జాడీలలో బెట్టి మూతలు వేసి యుంచుము.

షరా:—లేహ్యమును తయారుచేయునపుడు అడుగంటకుండ బాగుగ కెదుపుచుండవలెను. బొప్పాయి, సీమరేగు మొదలగు పులుపులేని, లేక పులుపు తక్కువగ నుండు పండ్లనుండి లేహ్యము చేయుచో నిమ్మకాయల రసమును జేర్చవలెను.

---

## 13 వ యోగము.

# బొప్పాయిపండ్ల లేహ్యము చేయుట

1. బాగుగ పండిన పండ్లనెంచి కడుగుము.

2. పై తొక్కను గీసి ముక్కలు చేయుము.

3. ముక్కలు గట్టిగా నున్నచో తురుము యంత్రములో బోసి తీయుము. లేక తొక్కలను గీయకుండగనే చంచాతో గుజ్జును గోకి తీయుము.

5. ప్రతి పౌను గుజ్జునకును ఒక ఔన్సు నిమ్మ రసమును జేర్చుము.

6. లేహ్యము తగినంత చిక్కబడు వరకు అనగా 103$^{0}$ శ. ల ఉష్ణత వచ్చువరకు ఉడికించుము.

7. వేడిగా నుండగనే సూక్ష్మజీవహరణము గావింపబడిన జాడీలలో పెట్టుము.

8. లేహ్యము జాలడీలో సర్దుకొన్నపిమ్మట పైని ఒక పలుచనిపొగ కరగించిన పారాఫిన్ మైనము పోసి యుంచిన దానిని చెడిపోకుండ కాపాడును.

---

14 వ యోగము.

# వెలగపండ్ల లేహ్యము జేయుట.

1. పండ్లను కొట్టి గుజ్జును గోకి తీయుము.

2. గుజ్జును తూచి దాని తూనికకు 1$\frac{1}{4}$ తూనిక గల లేక గుజ్జు మునిగి మునుగునంతటి నీటిని జేర్చుము.

3. మందాగ్నిపై గుజ్జు మెత్తబడు వరకును అనగా సుమారు అర గంటసేపు ఉడికించుము.

4. గుజ్జును జల్లెడపై పోసి కదిపి గింజలు తీసివేయుము.

5. గింజలు తీసివేసిన గుజ్జును మరల తూచుము.

6. దీని తూనికకు సమతూనికగల చక్కెర జేర్పుము. మందాగ్నిపై గట్టిపడు వరకు అనగా 103 శ. ల ఉష్ణత వచ్చువరకు ఉడికించుము.

7. వేడిగ నుండగనే సూక్ష్మజీవహరణము గావించబడిన జాడీలలో వేయుము.

18 వ యోగము.

# నారింజ మురబ్బా తయారుచేయుట.

1. ఒక డజను మంచి (కమలా) నారింజ పండ్లను (శీతకట్టు కాపు శ్రేష్ఠము) దీసికొనుము.

2. తొక్కలను దీసి లోపలి గుజ్జును విడదీయుము.

3. గుజ్జునుండి గింజలను సాధ్యమైనంత వరకు తీసివేయుము.

4. తొక్కల యందలి లోపలివైపు బెండుపొరను పై చేదు పొర నుండి వాడిగ్గుచున కత్తితో విడదీసి జాగ్రత్త పెట్టుము.

5. మూడు నిమ్మ కాయలను ముక్కలుగ గోసి రసమునుదీయుము.

6. పైని చెప్పినట్లు గీచిన నారింజ తొక్కల లోని పొరను నారింజ గుజ్జును, రసమును, నిమ్మరసమును కలుపుము.

7. పై మిశ్రణముతో సమభాగము నీటిని జేర్చి అరగంట కాచుము.

8. పైన 4 వ సూచనలో చెప్పినట్లుగ చేసి యుంచిన రెండు నారింజ కాయల తొక్కల పైపొరను పదునైన కత్తితో ⅛ అం. దళము గల పేలికలుగా చేయుము.

9. వీనిని నీటితో నైదు నిముషములు మరుగబెట్టుము. ఇట్లు నాలుగు సార్లు క్రొత్త నీటితో నైదేసి నిముషముల చొప్పున మరల మరల మరుగబెట్టుము.

10. ఏడవ సూచనలో చెప్పబడినట్లు కాచి తీసిన రసమును ముతక గుడ్డతో వడకట్టుము.

11. ఈ రసమును తూచి, అందు ముప్పాతిక తూనికగల చక్కెర జేర్పుము.

12. ఈ మిశ్రణమును చక్కెర కరుగువరకు కాచుము.

13. మరియొకసారి వడకట్టి తిరుగ మరగబెట్టుము.

14. ఇట్లు మరుబెగట్టుట జాగులేక చురుకుగ జరుగవలెను.

15. రసమునకు 103° శ. ల ఉష్ణత వచ్చిన పిమ్మట 9 వ సూచనలో చెప్పినట్లు తయారుచేసి యుంచిన తొక్క చీలికలను జేర్పుము.

16. తుదకు 105 ° శ. ల ఉష్ణత వరకు లేక జామి హల్వా విషయమున జెప్పిన పాకము వచ్చువరకు మరగించి దింపుము.

17. తెట్టె తీసి సూక్ష్మజీవహరణమునొందిన జాడీలలోబోయుము.

18. గట్టిపడు వరకుండి పైన కరగించిన పారఫిన్ మైనమును పోసిన చెడిపోదు.

షరా:— పైని చెప్పినట్లు నారింజగణపు పండ్లనుండి హల్వావలె తయారు చేయబడు దినుసునకే మురబ్బా (Marmalade) అని పేరు. కమలాఫలపు పండ్లలోను తీయనారింజ పండ్లలోను మురిబ్బా గట్టిపడుటకు తగినంత పులుపుండదు. కావుననే వీనికి నిమ్మ రసమును జేర్పవలసియుండును. శీతకట్టు కమలాఫలములలో మాత్రము కొంత పులుపుండుటచే నవి మురబ్బాకు ప్రశస్తము. దేశవాళీ నారింజ పండ్లలో దగినంత పులుపుండుటచే నిమ్మ రసమును జేర్ప నవసరము లేదు.

---

## 19 వ యోగము.

# నారింజ మురబ్బా—మరియొకపద్ధతి.

1. ఒక డజను (కమలా) నారింజ పండ్లను, అరడజను నిమ్మకాయలను తీసికొనుము.

2. వాని రెంటి నుండియు తొక్కలను దీయుము.

3. మూడు నారింజపండ్ల తొక్కలను దీసి వాడియైన కత్తితో పైపొరను వేరుచేయుము.

4. పై పొరను వెనుకటి యోగములో చెప్పినట్లు సన్నని చీలికలుగా చేయుము.

5. వీని నిరువది నిముషముల వరకు నాల్గు సార్లు నీటిని మార్చి యుడుకబెట్టుము.

6. తక్కిన నారింజ పండ్ల తొక్కలను, నిమ్మ తొక్కలను ముక్కలుగ గోసి వానిని గప్పునంతటి నీటిని జేర్చి పది నిముషములు మరుగనిమ్ము.

7. మరిగిన నీటిని తీసివేసి క్రొత్త నీటిని జేర్చి మరల నొక గంటసేపు మరుగనిమ్ము.

8. పిమ్మట నిట్లుడికించిన తొక్కలను పలుచని గుడ్డ( Muslin )లో వేసి పిండి కషాయమును తీయుము.

9. నారింజ పండ్ల యొక్కయు నిమ్మ పండ్ల యొక్కయు గుజ్జును పిసికి విత్తులను దీసివేసి యందు పైసూచన ప్రకారము తయారు చేయబడిన తొక్కల కషాయమును జేర్పుము.

10. దీని మిశ్రిణమును 20 నిముషములు మరుగనిమ్ము.

11. పిమ్మట వడకట్టి దీని రసమును తీయుము.

12. ఈ రసమును తూచిగాని కొల్చిగాని యందు ముప్పాతికవంతు చక్కెర జేర్పను.

13. మరల చక్కెర కరగువరకు కాచుము.

14. పిమ్మట మిశ్రిణమును 103° శ. ల ఉష్ణత వచ్చువరకు చురుకుగ మరిగించుము. అప్పుడు 5 వ సూచన ప్రకారము తయారు చేయబడిన తొక్క చీలికలను జేర్చి 105° శ. ల ఉష్ణత వచ్చువరకు కాచుము. జేక జామి హల్వా విషయమై చెప్పినట్లు పరీక్షించి తగినపాకము రాగానే దింపుము. కడపట తెట్టెతీయుము.

15. సూక్ష్మజీవహరణము గావింపబడిన జాడీలలోబోసి మురబ్బా గట్టిపడిన వెనుక కరగిన పారఫిన్ మైనమును పైన బోయుము.

షరా:—మిగుల నిర్మలమైన హల్వా తయారు చేయదలచుచో 11 వ సూచన ప్రకారము తీసిన రసమును పెక్కు మడతలు పెట్టిన పలుచని గుడ్డతో వడకట్టవలెను.

---

## 20 వ యోగము.

# మామిడికాయల పచ్చడి చేయుట

1. మంచి పచ్చి మామిడికాయల నెంచుము.
2. పదునైన కత్తితో తొక్కలను గీచివేయుము.
3. చిన్న ముక్కలుగ గోయుము.

4. వీని తూనికలలో ప్రతి సేరు ( 2 పౌనులు ) నకును ఈ క్రింది వస్తువులు సేకరింపుము. చక్కెర అర్ధ సేరు (1 పౌను); ఉప్పు చటాకు (2 ఔన్సులు); మిరియాలు, ఏలకులు, దాల్చినిచెక్క, జీలకర్ర, లవంగాలు సమపాళ్లుగ గలిపి కొట్టిన మసాలాపొడి ½ చటాకు (1 ఔన్సు); ఎండు ద్రాక్ష ¼ సేరు (½ పౌను); ఆవపొడుము 1 టీచంచాడు; అల్లము 1చటాకు (2 ఔన్సులు); ఎఱ్ఱమిర్చి ఇచ్చవచ్చిన ¼-½ చటాకు (½-1 ఔన్సు); సిరకా 1 టీకప్పు.

5. ముక్కలకు ఉప్పును చక్కెరయు జేర్చి ఒక గంట యుంచుము. ఈలోపున ఊటపుట్టి యివి కరగును.

6. మిశ్రమమును మందాగ్నిపై ఉడికించి మసాలా పొడియు ఆవ పొడియు వేయుము.

7. పిమ్మట అల్లపు ముక్కలును, ద్రాక్ష పండ్లను మిర్చిని జేర్చి మిశ్రమమును తగినంత గట్టిపడు వరకు ఉడికించుము.

8. అప్పుడు సిరకా జేర్చి మరల తగినంత చిక్కబడు వరకు ఉడికించుము.

9. వేడిగ నుండగనే సూక్ష్మజీవహరణము గావింపబడిన జాడీలో వేసి మూతపెట్టుము.

సూచన:—మసాలా ద్రవ్యములు, చక్కెర, మిర్చి, ఉప్పు మొదలగు వాని పరిమితి రుచులకు వచ్చినట్లు వారు మార్చుకొనవచ్చును. కాని పచ్చడి నిల్వ యుండునట్లు చేయు సిరకా ప్రమాణమును మాత్రము తగ్గింప కూడదు.

---

21 వ యోగము.

# సీమవంగపండ్ల పచ్చడి చేయువిధానము

1. పండిన సీమవంగపండ్ల నెంచుము.

2. ముక్కలుగ గోయుము.

3. వీనిని అల్యూమినియము పాత్రిలో గాని పింగాణీ పాత్రిలో గాని యుంచుము.

4. మెత్తబడు వరకు అనగా సుమారు అరగంట సేపుడికించుము.

5. దోమతెర గుడ్డతో గింజలును తొక్కలును పోవునట్లు వడ కట్టుము.

6. ఇట్లు తయారు చేసిన ప్రితి 5 సేర్ల (10 పౌ||) గుజ్జునకు ఈ క్రింది వస్తువులను తూచి యుంచుము.

3 పెద్ద చంచాల ఉప్పు.

2 టీ చంచాల మిర్చి.

2 పెద్ద చంచాల మసాలాపొడుము (జీలకర్ర, ఏలకులు, సహాజీర, లవంగాలు, దాల్చినచెక్క సమపాళ్లు)

1 పెద్ద చంచా ఆవపొడుము.

1 చటాకు (2 ఔన్సులు) అల్లము.

2 పెద్ద ఉల్లిపాయలు, 6 వెల్లుల్లిపాయలు.

3 కప్పులు సిరకా.

4 పెద్ద చంచాల చక్కెర.

7. గుజ్జుతో ఉప్పు. చక్కెర, ఆవపిండి చేర్పుము.

8. ఈ మిశ్రణములోనికి ఉల్లి, వెల్లుల్లి. అల్లము వీనిని ఒక గుడ్డలో మూటకట్టి వ్రేలాడదీసి ఉడుకబెట్టుము.

9. మరియొక గుడ్డలో మసాలాపొడుమును మూటకట్టి ఉడుకుచున్న గుజ్జులో వ్రేలాడదీయుము.

10. తేనెవలె చిక్కబడు వరకు ఉడుకనిమ్ము.

11. పిమ్మట గుడ్డమూటలను తీసివేసి సిరకాను జేర్చి మరల తేనె వలె చిక్కబడు వరకు ఉడుకనిమ్ము.

12. సూక్ష్మజీవసూనణము గావింపబడిన జాడీలలో నింపి మూతలు వేయుము.

---

22 వ యోగము.

## మామిడికాయల మురబ్బా తయారుచేయుట

1. మంచి పచ్చి మామిడికాయల నెంచుము.

2. తొక్క గీచివేసి ముక్కలుగ తరుగుము.

3. ప్రతి సేరు ముక్కలకు ఒకసేరు చక్కెరయు ఒకసేరు నీళ్లును జేర్చుము. మామిడికాయ ముక్కలు మిగుల గట్టిగా నుండుచో మొదట పది నిముషములు వాని నావిరిమీద ఉడికించుము.

4. నీరును చక్కెరయు కలిపిన యీ మిశ్రణమును చిక్కని పాకము వచ్చువరకు మరగించుము.

5. సూక్ష్మజీవహారణము గావింపబడిన జాడీలలో వేసి మూత పెట్టుము.

షరా:—పండ్లను జాడీలలో నిల్వ చేయుటకు వాని నట్లేగాని, పెద్ద ముక్కలుగ గోసి గాని పంచదారపాకము సందుంచి ముక్కలు నిర్మలముగను పారదర్శికముగను నగు వరకుడికించవలెను. సీమరేగు, మామిడి, బొప్పాయి, సీమవంగ, పుచ్చ (పై గట్టి భాగము) నారింజ తొక్కలు కూడ నిట్లు నిల్వ చేయవచ్చును.

---

23 వ యోగము.

# కాశీరేగుపండ్ల శర్కరీకరణము

(అనగా చక్కెరతో పాకముబట్టి యెండించుట)

1. డాగులుపడని పెద్ద కాశీరేగుపండ్ల నెంచుము.

2. ఇత్త ముళ్లవంటి ముళ్లతో అంతటను గుచ్చుము.

3. వీని నొక గుడ్డలో వేసి మూటగట్టి ఉడుకునీటిలో 5 నిమిషములుంచి తీసి యొక కుండలో వేయుము.

4. ఒక కప్పు చక్కెరకు 3 కప్పులు నీళ్లు చేర్చి కరగించుము.

5. ఈ పాకమును కాచి, మరగిన పిమ్మట నావేడి పాకమును కుండలో నుంచబడిన రేగుపండ్లపై అవి బాగుగ మునుగు వరకు బోయుము. 24 గంటలవరకట్లుంచుము.

6. పిమ్మట కుండనుండి పాకమును తీసి దానితో $\frac{1}{4}$ కప్పు చక్కెర (అనగా మొదట వేసిన చక్కెరలో నాల్గవ భాగము) మరల చేర్పుము. మరల మరగబెట్టి యా వేడి పాకమును పండ్లమీద బోయుము.

7. ఇట్లు ప్రతి దినమును పాకమును దీసి యందు మరల $\frac{1}{4}$ భాగము చక్కెర జేర్చి మరుగనిచ్చి పండ్లమీద బోసి 24 గంటలుంచుచు రావలెను.

8. పాకమునకు తేనెయొక్క చిక్కదనము వచ్చువరకిట్లు సుమారు 8-10 దినములు చేయుచు రావలెను.

9. కడపటిసారి పండ్లను పాకములో మూడు దినము లుంచుము.

10 అపుడీ పండ్లను దీసి తీగవలపై యెండబెట్టుము. బాగుగ యెండిన పిమ్మట జాడీలలో నిల్వచేయుము.

---

## 24 వ యోగము.

# అల్లపు శర్కరీకరణము

## (పొడిఅల్లపుమురబ్బా తయారుచేయుట)

1. లేత అల్లపు కొమ్ముల నెంచి బాగుగ గడిగి పైపొరను గీచి వేయుము.

2. సమమైన ముక్కలుగ గోయుము.

3. రెండు గంట లావిరిమీద నుడికించుము.

4. ముక్కలను తూచుము.

5. ప్రతి సేరు (2 పా॥) ముక్కలకు $1\frac{1}{2}$ సేరు చక్కెర, $\frac{3}{4}$ సేరు నీరు తూచి పెట్టుము.

6. చక్కెర, నీరు, ముక్కలు కలిపి $101^{0}$ శ. ల ఉష్ణతవచ్చువరకు మరగించుము.

7. దించి 48 గంటలట్లేయుంచుము.

8. మరల $103^{0}$ శ. ల ఉష్ణత వరకు మరగించి మూడు రోజు లుంచుము.

9. మరియొకసారి $105^{0}$ శ. ల ఉష్ణత వరకు మరగించి మూడు రోజు లుంచుము.

10. పిమ్మట తీగవలపై బాగుగ నెండబెట్టుము.

షరా:— రేగుపండ్లు, నారింజ, లేక దబ్బతొక్కలు, మామిడి వగైరా పండ్ల ముక్కలు ఇట్లు శర్కరీకరణము చేసి యుపయోగించు కొనవచ్చును.

---

25 వ యోగము.

# ఊరుగాయను తయారుజేయుట
(వివిధజాతుల మిశ్రణము)

1. మంచి దోసకాయలు, ముల్లంగి, పచ్చిమిర్చి, పచ్చి సీమవంకాయలు, పూగోబి, టర్నిప్, ఉల్లి మొదలగు వానిని సంపాదింపుము.

2. శుభ్రమైన నీటితో కడిగి పైపొర గీచివేసి పొడవు ముక్కలుగా తరుగుము.

3. ఎనిమిది కప్పుల నీటికి ఒక కప్పు ఉప్పు చొప్పున కలిపిన ద్రావణమును తగినంత తయారుచేయుము.

4. ముక్కలు నీ ద్రావణమునందు మూడురోజులు నానబెట్టుము.

5. పిమ్మట వానిని దీసి మూడు నాల్గు సార్లు శుభ్రమైన నీటితో కడుగుము.

6. ఆవ, పసుపు, ఎర్రమిర్చి, ఉప్పు మొదలగునవి జేర్చి సామాన్యముగ నూరుగాయల కుపయోగించు మసాలాపొడిని చేసి సిరకాతో గలిపి పలుచని చోవిపలె తయారుచేయుము.

7. ముక్క లన్నిటిని ఇట్లు సిరకాతో జేర్చిన మసాలా పొడితో గలుపుము.

8. సూక్ష్మజీవహరణము గావింపబడిన జాడీలలో $\frac{3}{4}$ భాగముబోసి పై $\frac{1}{4}$ భాగము నిండువరకు మరల సిరకా జేర్పుము.

పరా:—కొందరికి సిరకా కిట్టదు. దీనికిబదులు నూనె నుపయోగించవచ్చును. ముక్కలు ఉప్పునీటిలో మూడురోజు లూరుటమాత్రమావశ్యకము.

అ ను బ ం ధ ము.

# 1. పాలకోవా తయారుచేయుట.

1. ఈక్రింది వస్తువులను చెప్పిన పాళ్లప్రకారము సిద్ధముచేయుము.

| | |
|---|---|
| చక్కెర | 2 కప్పులు. |
| తేనె | ½ కప్పు. |
| స్వచ్ఛమైన పాలు | 3 కప్పులు. |
| వెన్న | 1 పెద్ద చంచా. |

2. అడుగు దళసరిగనున్న పాత్రి తెచ్చి అందు వెన్నగాక తక్కిన వాని నుంచుము.

3. మందాగ్నిపై బెట్టి బాగుగ కలుపుచు కాచుము.

4. ఈ మిశ్రిణపు రంగు కాగినకొలది గోధుమ వర్ణముగ మారును. క్రిమ క్రిమముగా దళసరెక్కును.

5. తేనెవలె చిక్కబడిన పిమ్మట వెన్ననువేసి కాపు సాగనిమ్ము.

6. మిశ్రిణమును నీటిలో కొంచెము వేసి చూచిన మెత్తని యుండ గట్టునంత వరకు చిక్కబడనిమ్ము.

7. ఒక సమమట్టమైన పళ్లెము దెచ్చి దానికి నేయిరాచి దానిలో నీ మిశ్రణమును బోయుము. రెండు దినములున్న తరువాత ముక్కలుగ గోయుము.

పరా:— ఉష్ణతామాపక మున్నచో వెన్న జేర్చిన పిమ్మట సామాన్యముగ 116° శ. ల ఉష్ణత వచ్చువరకు గాచుము. వెన్న కాయు

నపుడే 1 టీ చంచా కోకో పొడిని జేర్చిన ఛాకొలేట్ (Chocolate) రుచి వచ్చును. పళ్లెములో బోయక మునుపు కొంచెము వానిల్లా (Vanilla) సారమును జేర్చినను పరిమళము వచ్చును. మిశ్రణమును కాచుచుండగా పాలుగాని, తేనె గాని మంచివిగాక విరుగవచ్చును. కాని యట్లె చివర వరకు కాచినచో కోవా యేర్పడును.

---

## 2. జొన్నలనుండి బిడ్డలకును రోగులకును తేయాకునకు బదులు పానీయముగను నుపయోగపడు ఆహారమును తయారుచేయుట.

1. పచ్చని మంచి జొన్నలను సంపాదింపుము.

2. పరిశుభ్రమైన నీటిలో నొక పగలును రాత్రియు నాననిమ్ము. ఈలోపల నారుసార్లయినను నీటిని మార్చుము.

3. జొన్నలను పోగుగాపోసి యాపోగుమీద తడిగుడ్డనుకప్పి మొలక అంగుళము పొడవు వచ్చువరకు అప్పుడప్పుడు నీరు చల్లుచుండుము.

4. మొలక వచ్చిన గింజలను 8 గంటలసేపు నీడను ఆరబెట్టుము. పిమ్మట బాగుగ నెండువరకు నెండలో నుంచుము.

5. పిమ్మట మొలకలు పోవునట్లు రాచివేసి యించుక గోధుమవర్ణము వచ్చువరకు మందాగ్నిపై వేచుము.

6 మిగుల మృదువుగ నుండునట్లు తిరుగటితో విసరి వస్త్రఘాళి తము చేయుము.

7. ఈ మృదువైన పొడుమును "జొన్నమాల్టు" అందురు. దీనిని జావగా కాచి పిల్లలకును రోగులకును నివ్వవచ్చును. దీనితో కరకర లాడు బిస్కట్లను గూడ చేయవచ్చును. పాలు చక్కెర కలిపి పానీయ ముగ నుపయోగింపవచ్చును. జావతో ఇంచుక ఉప్పును చేర్చుకొనినను రుచిగా నుండును.

పానీయము తయారుచేయుట:— గృహోపయోగమునకు మాల్టును వారమున కొకసారి చేసికొనుట మంచిది. 1 పెద్ద చంచా మాల్టును తీసికొని వేడినీటిలో బాగుగ గలుపుము. రెండు నిముషము లట్లుంచుము. పిమ్మట నీ మిశ్రిణమును రెండు కప్పులు మరుగుచున్న నీటిలో బాగుగ కలుపుచు బోసి రెండు నిముషములు మరుగనిమ్ము. గుడ్డతో నీ మిశ్రిణమును వడియగట్టి చక్కెరను, పాలను, లేక ఉప్పును జేర్చి పుచ్చుకొనుము.



# రావుసాహెబ్ గోటేటి జోగిరాజు

గారిచే రచింపబడిన

# వ్యవసాయగ్రంథములు

## 1. వ్యవసాయశాస్త్రప్రథమపాఠములు

రెండవకూర్పు— వెల గ్లేజుకాగితముల ప్రతి రు 1-4-0; సాదాప్రతి రు 1-0-0. వ్యవసాయదారులకును పాఠశాలాంత్య పరీక్ష (S. S. L. C. Examination) కు జదువు వారికిని నుపయుక్తముగ నుండునట్లు తేటతెనుగున వ్రాయబడెను. 38 పాఠములు; 300 పుటలు; 47 చిత్రములు.

**2. పండ్లు — మొదటిభాగము :—** (వెల గ్లేజు కాగితపు ప్రతి 1-4-0) ఈగ్రంథముయొక్క సహాయమున్నచో ఫలవృక్షములను బెంచువారు సామాన్యముగ తాముచేయు లోపములను సవరించుకొని మితవ్యయముతో చక్కని తోటలను బెంచి తగినంత లాభమును పొందగలుగుదురు. 250 పుటలు; 131 పటములు.

**3. పండ్లు—రెండవభాగము :—** వెల గ్లేజు కాగితపు ప్రతి రు 1-8-0; సాదాప్రతి 1-4-0. ఇందు మామిడి, జీడిమామిడి వగైరా మామిడి కుటుంబమునకు జెందిన యారుజాతులను గురించి విపులముగ వ్రాయబడెను.

ఈ తోటలను పెంచువారి కత్యంతోపయుక్తము. 33(
పుటలు; 226 చిత్రములు.

## 4. పండ్లు — మూడవ భాగము :—

వెల రు 1-4-0 లు. ఇందు నారింజ కుటుంబము నందలి నారింజ, తీయనారింజ, కమలాఫలం, ఈడె, పంపరపనస తీయనిమ్మ, నిమ్మ, దబ్బ, నారదబ్బ, మాదీఫలం, వెలగ మారేడు మొదలగు జాతులను పెంచుటను గురించి విపులముగ తెలుపబడెను. 245 పుటలు; 35 చిత్రములు.

## 5. ఉద్యానకృషి ప్రథమపాఠములు:-

రెండవకూర్పు. వెల గ్లేజు కాగితపు ప్రతి రు 1-8-0 ఇందు మొదటిభాగమున నిర్మాణమును గురించియు,నిర్వాహకమును గురించియు రెండవభాగమున పుష్పాదికములను గురించియు మూడవ భాగమున శాకములను గురించియు, నాల్గవ భాగమున ఫలవృక్షములను గురించియు వ్రాయబడెను.
352 పుటలు; 50 చిత్రములు.

పై గ్రంథములు గాని వానిగురించి యింకను వివరములు గాని వలయువారు క్రింది చిరునామాకు వ్రాయవలెను.

డి. వెంకటాప్రయ్య
మానేజరు, గ్రామసేవాప్రెస్,
కొండెవరం, తూర్పుగోదావరిజిల్లా.